# వతన్‌దారులు

అ యి తే రా జా

—శ్రీడికంటి రామారావుగారు—

ఈవేళ రేపు మననిజాం రాష్ట్రములో గ్రామాధికారులపైన లేనిపోని నేరాలతుఫాను లేపబడి క్రొత్త ఎత్తుకై ఇప్పుడున్న గ్రామాధికారవర్గమును తుడిచివేయుటకుగాను పన్నాగములు ఎన్నో పన్నబడుచున్నవి. ఈకుతంత్రములందు ఎందరో తోరబడుచున్నారనునది నిస్సందేహవిషయము. ఇందుకనే లావారసీవతను నిరీకరణముకూడనని వతన్‌దారీ అన్యవంశములోనికిపోరాదనుట అనువిషయముపనికిరాదని కొన్నితంత్రీకరణములు గావించుచు తుదకుమాలీపటేలు వతనులను తీసివేయవలయునని ఒకపెద్దదెబ్బతీసి యీసిక్కును క్రిందినుంచిపైదాక అంగీకారయోగ్యముచేసి ప్రభుత్వమంత్రాంగకూటము (బాబేహుకూమతు) ప్రభువువారికరకుపంపగా అవిచ్ఛిన్న పారంపర్యముగ ననుభవించుచున్న ఎన్నోసంస్థానములు జాగీరులు, అగ్రహారములు, యినాములు, మన్సబులు దేశముఖుదేశపాండ్యాదివతనీరుసుములు, గ్రామాధికారపదవులు ఇత్యాదిఅనేకవంశపారంపర్యాదిసంక్రమణ వతనులను అనుశ్రుతిగాపాలించుచువచ్చుచుండిన మనసుప్రసిద్ధ యాసఫ్‌జాహి ప్రభువంశరత్నమైన మనప్రభువరేణ్యుడును అయనయాంతఃకరణ సన్నిహితులైన ఉన్నతప్రభుత్వకూటమివారును ప్రాచీనముగావచ్చెడి నీమారుపటేల్గిరీ వతనులను ఎగరగొట్టుటకు సమ్మతింపక నిల్చినవారైరి. దీనినిబట్టిదయామయుడగు మనప్రభువునకుగాని ఆయనదాశ్రయములతో పాలింపబడుప్రభుత్వమునకుగాని నివియప్రియమను అనిసుస్పష్టములగుచున్నను కుతంత్రపు లూరకొనక తమదుస్తంత్రములను రెచ్చగొట్టుచున్నారు. ఇప్పటికి ౫ సంవత్సరములకు పూర్వముపరకు ఈచర్చ స్పష్టముగా బహిర్గతముకాలేదు అంతా ౨-౩ సంవత్సరములోనిది తీవ్రరూపముదాల్చినది ఈ విషయము ప్రభుత్వేతరపక్షములనుండి యారంభింపబడి ప్రభుత్వాంతర్గతపక్షములందుగూడ ప్రవేశింపబడి విమర్శనలారంభింపబడినవి.

రాష్ట్రవిలక్షణతకు సముచితముకొన్ని సభలయందును, ఈరాష్ట్రమువద్దనిర్వహింపబడుచున్న ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సభాసమావేశములందును ఈగ్రామాధికారులపై యదార్థరహితములగు నేరారోపణలుగావించుచు ? వీరిపదభ్రష్టత్వమునకు సూచనలుగావింపబడుచున్నవి. వీరియభిప్రాయాదరణగల యధికారవర్గమునందుగూడ దుష్టాలోచనలు విశ్లేషించి వారిప్రోద్బలప్రయత్నములవల్ల పెక్కురయధికారులలో నీప్రభావముబలపడి వీరివాటలచ్ఛేదన కుపాయాన్వేషణలతోగూడిన చర్చలారంభింపబడి క్రొత్తనిక్కులు సృష్టింపబడి విచారణకు పెట్టబడుచువచ్చినట్లును ప్రబలమివికిలగలయూలజడివార్తలు విపరీతముగా రాష్ట్రమంతట వ్యాపింపబడినవి. కొన్నిప్రభుత్వాంగ కూటములకు ఈ తమకుసంబంధములేకపోయినగూడ నీవిషయము చర్చలు చర్చింపబడుచువచ్చినట్లు ప్రకటితమైనవి గతవత్సరాంతసమయమునందొక ప్రభుత్వార్థికవిచారణకూటమియందుకూడ గ్రామాధికారుల సాకారపక్షపాతము తొలగించుటకుకూర్చి తీర్మానప్రసంగము గావింపబడినది. కొన్నికొన్ని జిల్లానుబాలోనిఅధికారివర్గ సమావేశములందుగూడ నీవిధియకమైనయభిప్రాయములు వెల్లడిచేయబడుచున్నట్లువినబడినవి, ఇక ఇత్తెహాదుల్ ముసల్మానువారి నేరాలపట్టికమహావిపులమైనది వెల్లడిపరుపబడినవి. ముస్లింపత్రికలలోగూడ నిదేఘోషప్రతిధ్వింపబడుచువచ్చినవి. ఇంతటిమహాఘోషయారంభింపబడుటకై గ్రామాధికారులయందంతటి హైరానైన దుండగములుండెనాయనునది విచారణీయాంశము. వీనికి అవసరమైనప్రత్యేక సమాధానములనుగూడ సంగ్రహముగ కొన్నిటికిపత్రికాముఖమునగాని లేక లఘుపుస్తకరూపమునగాని నేను వెనుకనుంచి ప్రకటించెదను. మొత్తముపైననీప్రబలాందోళనాయుతముగు నేరారోపణలు చాలవరకసత్యములేగాక దుష్ప్రచారములుప్రత్యేకోద్దేశ నిమిత్తయుక్తములని దేశమునంతను విశేషారిష్టములతో కలవరపరచుచున్న నీగ్రామాధికారవర్గ సంబంధములగు విధ్యుక్తకర్మనిర్వహణాధికారవిషయములను పరిశీలించి విచారించినంతవరకు స్ఫురించకపోవు ఇది గ్రామాధికారుల దురదృష్టమనక తప్పదు. ఇదిరెండు రూపములుగ సాగింపబడుచున్నది, ఒకటి సామాన్య యధికారుల ప్రేరేపణతో యుచితానుచితములెరుగని రైతులకొకాహేతువులగల్పించి పురికొల్పుటవల్లను, రెండవది మద్రాసురాజధానినుండి జాతీయతసాత్త్విక వర్జితముగు కాంగ్రెసువిజృంభణతో తరలిపారి తలదాచుకొనుటకీరాష్ట్రమునకేతెంచిన జన్నిసురాక్షసియొక్క మాయావేశ సంజనిత ప్రబోధయుతములగు రైతుల అర్థశూన్యగర్జితముల వల్లనుతప్ప మరొకటిగాదు, ఎవ్వరీపదవులనధిష్ఠించినను వారెల్లరికీ ప్రవృత్తినవలంబింతురు అందులోక్రొత్తవైఖరి మరింతవింత వైపరీత్యములు కొన్పడవలగుట నిక్కమము గావున రైతులకీగొడవ ఎక్కువపట్టజాలదు ఏదిఎట్లయినను నిదియు ఇత్తెహాదుల్ ముసల్మానువారి ఎత్తులఫలితముగా మొలకలెత్తినది గాని వేరుగాదు—

ఈలాంటిప్రచండశక్తులోల మొకవంక సాగుచుండ నీగ్రామాధికారుల కేమాత్రమును భయభీతికలుగుచున్నట్లుకనుపించదు. తుదకువారి పీనులకైనను నీఘోషలువినుపించలేదనుటలో ఆశ్చర్యములేదు. ఇట్టిగా శ్రీకారుల పూర్వానుగతహక్కుల నిగ్రహించుకొనప్పుడును, లావారసీవతనులను మరొకరికి ధృవపర్చుగూడదని కొన్నివతనులను సర్కారులో కలుపుకొనుచున్నప్పుడును, వంశాంతరమార్పులుగూడదని దుహితదౌహిత్రవారసత్వములను ఒట్టుబెట్టుటయాలోచనలవడిగిన పట్టునను ఏమంత యునుయేమియుబాధపడియుండియుం చాలవచనులకు బోనొట్టుకొనుటకు సరిపెట్టుకొనిరి వారైనారు, గావుననిప్పుడు దైవవశమునకు ఎంతటిభీతత్వాంగోళనలు చెలరేగినను తమకు గావని కడుపు లోనిచల్లగడలకుండ పూనముద్రాంకితులై యొకనాటికి మెల్లగానీకొద్దివతనులనుగూడ నిలోదకము లిచ్చుకొనునట్లున్నది-

ఇప్పటివరకు గ్రామాధికారులపైన గావించుచున్న ఆక్రమ, అన్యాయమైన దాడులనుజూచి సహింపజాలక ఆయ్యోపాపము ఈగ్రామాధికారులకేమికీడుమూడనున్నదో మరేమిగతి పట్టనున్నదోయని ఇతరపక్షములవారు సానుభూతివిజ్ఞాపుము ప్రచారముచేయుచున్నను నిజసమాజమువారు యజగరములమాడ్కి తమవిషయమై ఏవిప్లవము లంకురించి అవి ప్రళయంకరములు గానున్నవో యూహించుకొనక తమకుగావని పూనధారులై తమపనిజేసుకొనుచుండుటవలన యొకానొకప్పుడు సన్నగిలి యారంభించిన వ్యాధిచికిత్సలేకవృద్ధిబొంది మృత్యురూపముదాల్చినట్లు ఇదివరకుజరిగిన మార్పులవలనకలిగిన పరాభవములవలెనే తుదకప్రభుత్వకారణమేర్పడి పోవలసిన కాలగతి పట్టవచ్చును-

వతన్‌దారుపద్ధతిచొరలిన ప్రభుత్వములు, సంస్థానాలు, జమీందారీలు, జాగీరులు ఎల్లుతొలగింపరాని వంశపారంపర్యవారసత్వ హక్కులో వతన్‌దారీలనబడు నీగ్రామాధికారపదవులుగూడ వీనన్నిటికన్న అనాదిసిద్ధములై వంశపారంపర్య సంక్రమితములుగావున వీనిపైగావించెడు నేరములన్నియు అసత్యారోపణలు అనియు, గ్రామాధికారులనుతొలగించుట సంప్రదాయవిరుద్ధమనియు రాష్ట్రక్షేమమునకు భంగకరమనియు గ్రామాధికారులందరు తమనిద్ర వదలుచుండి మేల్కాంచి ఎదురొకని కదలికను గావించుకొనవలసినఅవసరము సంఘటించియున్నది-

## బ్రిటిషువారియుద్ధంఖర్చు

బ్రిటనులోయుద్ధమునకు కావలసినఖర్చున్నిపన్నులెక్కువైనందువల్ల ఇకమీద సంవత్సరానికి ౨౫ కోట్లపౌనులు అదనంగాపన్నులు చెల్లించవలసివచ్చినది. అదాయపుటన్ను ౧౪ షిల్లింగును హెచ్చించి మొత్తం ౧౦ షిలింగులుచేసినారు, తక్కువఆదాయములకు తక్కువరేటు నిర్ణయించినారు

యుద్ధపు మొదటి ౧౫ మాసాలలో ౪౬౨ కోట్లపౌనులుఖర్చైనది,

## అ. భా. పద్మశాలి సప్తమ మహాసభ

### కార్యవర్గసమావేశము

స్వ.వి.) సోలాపురం, ఏప్రిల్ ౧

సోలాపురం తే౩౧-౩-౪౧న అ భా పద్మశాలిసప్తమమహాసభ కార్యవర్గసమావేశము శ్రీ సత్తెగారిభవనములో జరిగినది. కార్యవర్గసభ్యులు శ్రీ వడ్డెపల్లివిఠోబా, శ్రీ పల్లిహనుమంతయ్య, శ్రీ వేం వాగయ్య, శ్రీ బూస్సలవిఠోబా. శ్రీ కూడిస్తిని నారాయణరావు శ్రీ చిలుకమల్లయ్య శ్రీగుంటక నరసయ్య గార్లు హాజరుగానుండిరి ఈక్రిందితీర్మానములు గావింపబడినవి.

### తీర్మానములు

సంఘోన్నతికై నిరంతరముకృషిజేసి కీర్తికాయులైన శ్రీ రావిటిపరమేశ్వరశాస్త్రి గారిమరణమునకు చింతించుచు మృతాత్మకు శాంతినొసగ యీశ్వరుని ప్రార్థించుచు, వారికుటుంబమునకీ సభవారు తమసంపూర్ణ సానుభూతిని తెలియజేయుచున్నారు.

అ.భా. పద్మశాలిసప్తమమహాసభ ప్రధానకార్యదర్శులు, కార్యవర్గసభ్యులునగు శ్రీగుంటక నరసయ్యపంతులుగారి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మమ్మ గారియకాలమరణమునకు చింతించుచు, మృతాత్మకుశాంతినొసగ యీశ్వరుని ప్రార్థించుచు శ్రీ పంతులు గారి కుటుంబమునకీ సభవారు సంపూర్ణ సానుభూతిని తెలియజేయుచున్నారు.

కీర్తిశేషులైన శ్రీ రావిటి పరమేశ్వరశాస్త్రి గారిస్థానే అ.భా. పద్మశాలిసప్తమమహాసభ కార్యవర్గసభ్యులుగా సోలాపురవాస్తవ్యులు శ్రీ చిలుకమల్లయ్య గారిని యేకగ్రీవముగ నెన్నుకొనడమైనది.

అ భా. పద్మశాలి సప్తమమహా సభాధ్యక్షులు దక్కన్ పద్మశాలి సంఘోద్ధారక బిరుదాంకితులగు శ్రీవకీల్ పాకిం శాంతు జనార్దనంగారు నిజాంగవర్నమెంటువారిచే డిపార్టుమెంటుచీఫ్ సూపరింటెండెంటు(సదర్ మొహతమీమ్) గానియమించబడినందుకు పరమానందమునొందుచు శుభాకాంక్షలర్పించుచు, అభిమానమును జూపుచున్న శ్రీ నిజాంప్రభుత్వమువారికి సభవారు కృతజ్ఞత తెలుపుకొనుచున్నారు

సోలాపురివాస్తవ్యులు, పద్మశాలియువక ప్రముఖులు, కాంగ్రెసు కార్యకర్తలగు శ్రీమార్పురి మల్లయ్యగారు సోలాపుర మునిసిపల్ ప్రసిడెంటుగా యెన్నికొనబడినందుకు సభవారు సంతోషమునొందుచున్నారు.

అ భా పద్మశాలిమహాసభకు తగిననిబంధన లేనందున "నియమావళి" తయారుజేసి సోలాపురంలో జరుగనున్న మహాసభకు ముందుకార్యవర్గము మూడుసమావేశపరుచవలసినదిగా ఒక ఘటన కమిటీనియేర్పాటుగావింపబడినది.

సోలాపురమందు - మున్న మే నెలలోజరుగనున్న అ భా పద్మశాలిఅష్టమ మహాసభకు యీ దిగువవారిలోనొకరిని అధికసంఖ్యాకుల సమ్మతిని అధ్యక్షులుగా యెన్నుకొనవలసినదిగా ఆహ్వాన సంఘంవారికి సూచింపనైనది:

శ్రీమాన్ బత్తిని పొట్టన్నగారు. బి ఎ ఎస్. టి,సి డి. దికొండసాయన్నగారు (అహమద్‌నగరం) పాకీందావతు జనార్ధనంగారు [హైదరాబాద్] పాకీవనమాల నారాయణదాసుగారు., కార్యంపూడి నాగేంద్రుడు బి ఎ బి ఇడి. చీరాల

సోలాపురంలోజరుగనున్న మహాసభలు మే నెల ౧౦ ౧౧,౧౨, తేదీ లోజరుపుట సూచింపబడినది

# ప్రజావిద్యామహాసభ

## నాల్గవసమావేశము

అపూర్వమైనఉత్సాహము-అవిద్యానిర్మూలనసూచనలు

మహారాష్ట్రాలోచేరిన పర్భనీపట్టణములలో ౯, ౧౦, ఏప్రెల్ తేదీలలో నాల్గవప్రజాపక్ష విద్యామహాసభ శ్రీయుతవినాయకరావు బారట్లాగారి అధ్యక్షతలోజరిగెను. మహాసభయొక్క ఏర్పాటులు రెండుమాసాలుండి పర్భనీలో ఆహ్వానసంఘమువారు బాగుగాచేయుచుండిరి స్వచ్ఛంద సేవకులు చాలాకృషిచేసియుండిరి. ఆహ్వానసంఘాధ్యక్షులు వృద్ధులును నాయకులునుఅయిన నావల్ గారు హైదరాబాదునగరమునుండి ౮ ఏప్రెల్ నాడు ప్రజానాయకులనేకులు పర్భనీకి వచ్చిరి అందుముఖ్యులు మహాసభాధ్యక్షులగు వినాయకరావుగారు. గతసభాధ్యక్షులగు కాశీనాథరావు వైద్యగారు బూర్గులరామకృష్ణారావుగారు రామకోటీశ్వరరావుగారు శ్రీసన్నాయకుగారు గోపాలరావు బూర్గాంకరుగారు జనార్దనదేశాయిగారు మున్నగువారు పర్భనీకి తెల్లవారి ౫ గంటలకురైలుచేరెను, చీకటిలోనే పట్నములోనిజనులు గుంపులుగాస్టేషనుకువచ్చి అగంతుక మహాశయులకాహ్వానమిచ్చిరి. జయజయధ్వనులుచేసిరి, నాయకులను పుష్పమాలాక్రాంతులనుగాచేసి ఊరేగింపుచేసిరి. స్వయంసేవకులును స్వయంసేవికలును పట్నముఖ్యులును, అధ్యక్షునిఊరేగింపుతో తీసుకొనివెళ్లిరి, మహాసభామంటపమును ౩ గంటలవరకుచేసిరి. ఆటుపైన్మహాసభ ప్రారంభమయ్యెను, సభలో ౧౦౦౦౦ మందికిపైగా జిల్లాలనుండివచ్చినప్రతినిధులు చేరియుండిరి. పర్భనీవాసులనువిశేషము గావిచ్చేసియుండిరి, నావల్ గారు తమఆహ్వానోపన్యాసమునుచదివి వినిపించిరి. తర్వాత అధ్యక్షులఎన్నికజరిగెను వివిధజిల్లాల నాయకులు తమతమపక్షమున అధ్యక్షునియెన్నుకొనిరి, నారాయణరావు నందిగాంకరు గారును దేవీదాసురావు గారును శ్రీమతిఇందుతాయి కుల్కర్ణి గారును రామకోటీశ్వరరావు గారును బూర్గులరామకృష్ణారావు గారును శ్రీధరనాయకు గారు గోపాలరావుగారును, జనార్ధనరావు గారును మరికొందరును తమతమజిల్లాలపక్షమున అధ్యక్షనియామకమునుగురించి తీర్మానమును ప్రతిపాదించిరి. సభాప్రారంభమునకుపూర్వము ప్రార్థనగీతములుజరిగెను, అటుతర్వాత మ-భు-వ-ని జాంప్రభువుగారిపటానికి పుష్పమాలనువేసి సభవారు తమరాజభక్తినివెల్లడించిరి. తర్వాతసభాధ్యక్షులు తమఉపన్యాసమును చదివివినిపించిరి.

మహాసభలో స్థానికాధికారులుచాలామంది విచ్చేసి గౌరవస్థానాలనలంకరించియుండిరి, మహాసభఅత్యంతోత్సాహముతోజరిగెను. అధ్యక్షులఉపన్యాసాలును తీర్మానాలును మునుముందు ప్రకటింపబడును.

### ఆంజనేయ జయంత్యుత్సవం

హైదరాబాదు (దక్కన్) ఖుర్దాదు౭-

పైయుత్సవం సికింద్రాబాదులో మారుతివీధిలో ౧౧ఏప్రెలునుండి ౨౦ ఏప్రెల్ వరకు జరుగుచున్నది. సాయంకాలము ౬-౩౦ గంటలకును రాత్రి౯-౩౦గంటలనుండి యూపన్యాసాలు, హరికథలు జరుగును.

### సీతాఫలమండిమసీదు

హైదరాబాదు(దక్కన్) ఖుర్దాదు౭-

గౌ॥ మంత్రి అబ్దులజీజా గారుగతవారం హైదరాబాదునగరములో సీతాఫలమండిలోని మసీదులో నమాజుకైవెళ్లి అమసీదుసహాయార్థం ౫౦౦ రూపాయీలు మతశాఖనుండి యిప్పించినారు.

## సదాశివపేటలో ఇంటిపన్నులవసూలులో అక్రమము

సదాశివపేటలో ప్రతిసంవత్సరము ఆబాన్ నెలయందియుటకు పూర్వమే వర్తకులు, సాహుకార్లసాధారణముగా యింటిపన్నులను బేబాకీ చేయుచుందురు. యితరులవద్దమాత్రము కొన్ని సంవత్సరములనుంచి బకాయివచ్చుచున్నది. యీ సంవత్సరముపన్నులుచెల్లించవలసిన తారీకురాక ముందే తహశీలుదారుగారువచ్చి పన్నులను పేష్కీగా యివ్వవలసినదని సాహుకార్లనందరిని తమ సముఖమునకుపట్టి తెప్పించి నిర్బంధపరచిరి. వారువచ్చుటతోనే షరీ రశీదుచించి చేతిలోపెట్టి మళ్ళీ కారీలను పంపి పన్నులను వసూలుచేయించిరి, సరియైనపుజరుతూడవినరైరి. యిజమానులులేకున్న గుమాస్తాలతో యింటిలోనిబదితరులనోపట్టి వసూలుచేసిరి. ౨ గంటలలో౧౦౦౦ రూపాయలనీవిధముగ వసూలుచేసిరి. అవమానమునకువెరచి కష్టమునకోర్చియైనను కొందరుపన్నులనుచెల్లించిరి.

సాధారణముగా బకాయిలు వుంచుచుండిన వారినిమాత్రము విచారించరైరి.

ఇంటిపన్నులు చెల్లించుటకొరకు తారీకును గూడ నిర్ణయించక యేసమయమునైనను యేకాలమునసైనను నిష్కారణముగా నిమునషములపైన ఇంటిపన్నులు వసూలుచేయుట ఏలాటక్రమమో అధికారులుగమనించగలరు.

## అఖిలభారత పద్మశాలి యువకమహాసభ, కార్యవర్గసమావేశము

(ఒక విలేఖరి)

సోలాపురం తేది ౧-౪-౪౧వ అ. భా. పద్మశాలితృతీయయువకమహాసభ కార్యవర్గసమావేశము శ్రీగుంటక నరసయ్యపంతులుగారి అధ్యక్షతనజరిగెను. ఈదిగువతీర్మానములు గావింపబడెను.

అ. భా. పద్మశాలి సప్తమమహాసభ కార్యవర్గమువారు సమావేశమయి యీదినరాగావించినతీర్మానములు యీసభవారు సంపూర్ణమున ఆమోదించుచు,

సోలాపురంనందుజరుగనున్న అ. భా. చతుర్థి పద్మశాలియువకమహాసభకు నీదువారిలోనొకరిని అధిక సంఖ్యాకులసమ్మతిన అధ్యక్షులుగా యెన్నుకొనుటకు ఆహ్వానసంఘమువారికి సూచింపబడినది.

శ్రీయుత యల్లండి అనంతయ్యగారు
,, భూస రాధాకిషన్‌గారు
,, కార్యంపూడి రాజమన్నారుగారు ఎం-ఏ.
,, తాడిపర్తి శ్రీకంఠము గారు బి-ఏ-ఎల్ ఎల్-బి.
,, యీరాబత్తిని లక్ష్మణరావుగారు
,, బ్రెంకల రామచంద్రయ్యగారు

మహిళాసమాసభ అ. భా. పద్మశాలి ద్వితీయ మహిళాసభగూడ పైసభలతోపాటు జరిపించుటకు ఆలోచనలుజరుగుచున్నవి.

## చండూరుపట్టి గ్రామాధికారుల ప్రకటన

చైత్రశు ౧౭ ల నాడు బంగారిగడ్డలో సమావేశము

శ్రీసయ్యదు మహమ్మద్ షీఫ్‌ఆర్గనైజరు మద్ధుం మహమ్మారిగారు జనాభాలెక్కలలో మహమ్మదీయుల సరియైనసంఖ్యతేలకపోవడానికి గ్రామాధికారుల వారసత్వమార్తిభవించినదనుటలో సంశయములేదు మాపై నేరమారోపించుటబహు తేలికయైపోయినది జనాభాలెక్కలకు మాకేమి సంబంధమండీ? పైఆర్గనైజరుగారికి లోగాకూడ యిలాపరిణమించినది తెలుసుకొనిగూడ వరిష్ఠాధికార్లకు గాని వారికే యన్యూమిరేటర్లుగా నిర్ణయించుటకెందుకు ఉత్తరువ్రాయలేదో. యీచిన్నపదవులు మాకుండుటవల్ల వారికున్న కడుపుమంట యెంతచిత్రంగా ప్రకటించుచున్నారో గమనించండి. మాపై మా రైతులకు ద్వేషంకలిగించు అన్ని మార్గాలుదొక్కి అందులో క్రియార్థమైకూడ మమ్ముల ఏదోవిధంగా కొలంగెళ్లబుచ్చనివ్వడం లేదు. యిప్పుడుగ్రామాలలో జరుగుచున్న అత్యాచారాలలో నూటికితొంభైపాళ్లు ఎవరిమూలంగా జరుగునో అవసరమగుచో మేమునిరూపించజాలము మాపైఆరోపణచేయు ఆరోపణలన్నియుసరిగా ఆలోచించకుండా, ద్వేషపూరితంగా చేయబడుచున్నవి.

## సరియైనరోడ్డు లేదు

కొండపర్తి (తాలూ వరంగల్) చ-౪ ఆర్జి చేహస్తు

ఇదిపురాతనగ్రామము. ప్రతాపరుద్రుని కాలమున పేవాని కాపురమండినట్లు శాసనములవలన తెల్పుచున్నది ప్రస్తుతము హన్మకొండ ఓరుగల్లు దేవాలయముల వంటి దేవాలయములు శిల్పకళాపుణ్యమున శిథిలావస్థలోనుండియు వెనోళ్లచాటుచున్నది: రుద్రుని కాలమున తేజోధనధాన్యబాహుళ్యమై యీలరారిన దిప్పుడు సామాన్యగ్రామముగా మారినది. కానియిప్పటికిని, సర్కారిబడి పూర్వతహాతానియా, ఉర్దూతెల్గు బాలికాపాఠశాలలు, బ్రాంచిపోష్టాఫీసు, మరియు (౩౫౦౦) జనసంఖ్య చేతలయుచు దొరతనమువారికి రూ [౨౫౦౦] ప్రతిసం॥ఆదాయము చెల్లించుచున్నది. ఇచ్చటినుండి వ్యాపారమునకుకేంద్రస్థానమైన మట్టెవాడ [౬] మైళ్లదూరమున కలయుచున్నది-౧౦ మైళ్ల దూరమున హన్మకొండయగు వరంగల్ నకు ముఖ్యస్థానమునున్నది. కానిదొరతనమువారును రాకపోకడలకును అపారకష్టనష్టములకు లోనైయుండియు జంతువులకును జనులకును ప్రాణసంకటముగలిగించుచాటను (రోడ్డును) బాగుచేయదలంచకపోవుట విధిగావిన్నపములుచేసినను కొంచెమైన ఆలోచింపకపోవుటయే ఆనిపట్టియున్నదని తలంచవచ్చును. రాకపోకడలకష్టము చెప్పనలవికాదు,

ఇంచుమించుఏమిదినెలలు బురదనీళ్లనిండి జనులు బండ్లు నెలలలోదిగబడి యితరులసహాయముచే బయటబడుటయెవ్వరు చూడనిరొండలఒకటి రెండురోజులుబాధపడి బయలుబడుటో శకపరలోకయాత్రచేయుటో కలుగుచున్నది, బండ్లు అయ్యిచో నొగలువిరిగి గీరలుకూలి గమ్యస్థానము చేరలేక నష్టపడుచు అధికారులు యిబ్బందులకు రలోనగుచున్నారు, మరియు ఆయినోలుజాతర

దొరతనమువారికి బహులాభదాయకముగల స్థలమని తెల్పియేయున్నది. హన్మకొండకుపెళ్లుమధ్యదారి ప్రక్కనే ఫణికలరామప్పదేవాలయము ఘనకీర్తి గాంచినవన్నె కెక్కినవి. యాత్రికులకు రైతులకు రహదారి కష్టములబాపు నుదారగుణను. దొరతనమువారికి గలుగవలెనని టీక తులయభీష్టము గ్రామములున్నజాతర ఆదాయములగురించియు, దొరతనంవారు శ్రద్ధవహించి యీగ్రామంమీదుగ పోవుజాతర అచ్చటనుండి వర్ధన్నపేటరోడ్డుకు కల్పినచో ఖమ్మం, సూర్యాపేట, బెజవాడవరకు హైదరాబాదువరకును నిష్కంటకముగా జనులు ప్రయాణముసల్పవచ్చును యిందుకు దొరతనమువారు తగినశ్రద్ధవహింతురని కోరిక.

ఇట్లు
వి. కనకయ్య.

## వరంగల్ వర్తకోద్యోగ సంఘము

(స్వ.వి)

శ్రీవృషసం॥ చైత్రశు౯లు ఆదివారంరోజున శ్రీరామలింగేశ్వర ఆలయమున ఉదయం౭గంటలకు సుమారు ౪-౫౦గంటలకుపైగా వర్తకోద్యోగస్థులు సమావేశమయి, రెండు గంటలకు పైగా భజనలుజరిపి, అపయిబట్టలకోట్లు, నెరిడిబంగారుకోట్లు కట్టివేయించిరి మహారాజశ్రీ మాదిరాజు రామకోటేశ్వరరావుగారు (హైకోర్టువకీలు) నిన్నటిదినమువచ్చి, రాజశ్రీ అల్లాడితెలుబరిబట్టల దుకాణముగార్కి నచ్చచెప్పనందువల్ల ౪-౫వందల వర్తకోద్యోగస్థులుపోగాను, (కొట్లు కట్టివెదినందులకు మిక్కిలిధన్యవాదములు జెల్పిరి.

ఇదేసాయంత్రము ౭గంటలకుపైగా దేవాలయమున, మ.రా శ్రీ. మదూరి సోమయ్యగారి అధ్యక్షతక్రింద సభజరిపి ఆడ్తి, కమీషన్, కిరాణం, మనియారం, ఆనాజ్, బట్టల, నెండిబంగారు దుకాణములు యీవారంపూర్తిగా కట్టివెదినందులకు వర్తకసంఘమువారికి సాహుకార్లకు, మాదిరాజు రామకోటేశ్వరరావుగారికి వర్తకోద్యోగసంఘమువారు మిక్కిలి కృతజ్ఞతావందనములు తెలిపిరి.

## ఆర్యసమాజ స్థాపన

నల్లగొండ జిల్లా హుజూరునగర్ తాలూకా కోదాడ్ గ్రామమున ౩-౪-౪౧తేదిపగలు ౧౧-౨ లకు స్థానికభవనమందిరమున శ్రీయుత డాక్టర్ మారుపల్లి వెంకటేశ్వరగుప్తా మిరియాలగూడెము వారిఅధ్యక్షతలో సమావేశమయి శ్రీమాన్ భద్రదేవుసిద్ధాంతి, వుపదేశక్ ఆర్యప్రతినిధిసభా హైద్రాబాదు నిజాంస్టేటు గారిచేఆర్యసమాజసిద్ధాంతములు నియమములుతో, వుపన్యాసానంతరము యీదిగువపేర్లుగను స్థానికప్రముఖులను గార్యకారిణీసంఘములో అధికారులను ఎన్నుకొనిరి: —

అధ్యక్షులు-శ్రీమాన్ కోత్తాపిచ్చయ్యగుప్త,
ఉపాధ్యక్షులు-,, గొల్లపూడి నరసింహంపంతులు,
కార్యదర్శి-గుడిగుంట్ల అప్పయ్యగుప్త,
సహాయకార్యదర్శి-కుర్లచెర్వు చినసత్యనారాయణ
కోశాధ్యక్షులు-నాగుబండి కేశయ్యగుప్త,
పుస్తకాధ్యక్షులు- బొడ్ల సత్యనారాయణగార్లు,

ఇట్లు
ఏ.ఆర్.నటరాజ

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర చైత్ర బ॥ ౩

సోమవారము


## తిరువాన్కూరు వివాహశాసనం

తిరువాన్కూరు సంస్థానము మళయాళ దేశములోనిది. మళయాళదేశాన్ని గురించి మనపూర్వులు ఆడుమండల రాజ్యమనిన్ని, మంత్ర తంత్రాలస్థానమన్ని, విచిత్రాచారవ్యవహారాల కేంద్రమనిన్ని ఎన్నెన్నోకథలను కల్పించి వినోదముగా చెప్పుకొనుచుండెడివారు. యథార్థమేమన అచట మనకు భిన్నముగానుండు ఆచారములు కొన్నికలవు. స్త్రీపురుషులకు తలకుముందుభాగమందే శిఖలుండును. అందరును అడ్డగుడ్డకట్టుదురు. స్త్రీలకే వరసత్వపు హక్కు. ఇదిరాజవంశానికినివర్తించును. మహారాజు కుమారుడు రాజు కానేరడు. మహారాజు మేనల్లుడే రాజగుచువచ్చినాడు. దీనినే అచ్చట "మరుమక్కతాయపద్ధతి" అని యందురు.

మళయాళీలలో ఉంచుసట్టి ఘోరమైన పూర్వాచారం పట్టుదలలు మరే హిందూవర్గములలోలేవు. అస్పృశ్యులను మలబారీలు చూడరు. చూచి తేకూడ స్నానము చేయవలసిన దే. బ్రాహ్మణ స్త్రీలుశూద్రులనుతాకరు. ప్రతిజాతిలోని స్త్రీపురుషులును దినానికిసాధారణముగా రెండుమారులు కొలనులలో స్నానము చేయుదురు. ఇట్టియాచారాలు విశేషముగా అచ్చట నేటికిని కానవచ్చుచున్నవి.

అట్టి తిరువాన్కూరు సంస్థానములోని హిందువులను శుద్ధసనాతనులని చెప్పవచ్చును. సనాతనులనగా కొన్ని పూర్వాచారాలను పాటించి మరికొన్ని పూర్వాచారాలను వర్జించువారు అను నర్థములో ప్రయోగించు చున్నాము. అట్టి సనాతన హిందూసంస్థానములో బాల్య వివాహనిషేధ శాసనము ౫ దినాలక్రిందట శాసనసభవారిచే అంగీకరింపబడెను. కొందరు అయ్యారుసభ్యులు దానిని ప్రతిఘటింపక పోలేదు. కాని విశేషమేమనగా ప్రధాన మంత్రిగారగు సర్. సీ. పీ. రామస్వామిఅయ్యర్ గారు "ఈవిషయములో ప్రభుత్వమువారును ప్రభుత్వ నియుక్త సభ్యులును తటస్థులుగా ఉందురు." అని ఒక తటస్థపంథను ఏర్పాటు చేసిరి. మనరాష్ట్రములోను మన ప్రధానామాత్యులుంగారు దూరదృష్టితోనే బాల్య వివాహశాసనము మనశాసన సభలోచర్చకు వచ్చుటకుచాలకాలానికిముందే "ఒకవర్గానికి చెందిన మతశాసనముల విషయములలో ప్రభుత్వసభ్యులు తటస్థులుగా ఉండగలరు." అను న్యాయమును నిర్వచించి యుండిరి. కాని అదేమిచిత్రమో హిందూ బాల్య వివాహశాసనము ఓటుకు (ఛందకమునకు) పెట్టగా ప్రభుత్వసభ్యులలో ఇద్దరు తప్ప తక్కినవారును, ప్రభుత్వనామకరణము పొందినసభ్యులును, ముసల్మాను సభ్యులలో ఒకమహాశయుడుతప్ప తక్కిన వారును అందుపాల్గొని తమ ఛందకములను శాసనవిరుద్ధముగా ఇచ్చిరి.

ప్రతిమతములోను ప్రొటెస్టెంటు క్యాథలిక్కు, షియాసున్నీ, హీనయాన మహాయాన, విభేదాలవంటి భేదాలు వర్తించుచూ వచ్చినవి. హిందువులలోను సనాతన సంస్కార విభేదాలుకలవు. హిందూనాయకులుకాని, హిందూ మంత్రులు కాని, అధికారులు కాని, శాసనసభ్యులుకాని యెచ్చటనైనను సరే ఇతర మతాలలోని ఒక శాఖను మెచ్చుకొని ఇంకొ శాఖనుక్రింద బెట్టి ఒకరిపీపుతట్టి ఇంకొకరి నెత్తినచేయి బెట్టిఒకవర్గాన్ని పైకిలేపిఇంకొక దాన్ని నేలకుబెట్టిన యెట్లుండును? ఏదేమిసముగా హిందువులలోని సంస్కార సనాతనమత విభేదాలు కేవలము హిందువులకు సంబంధించినవే. అవి నారంతకువారే ఈనాడుకాకున్న, పదేండ్లకు కాకున్న, ఒక అర్థశతాబ్దానంతరమైనను, పరిష్కరించుకొనగలరు. ఇతరమతస్థులు—వారుక్రైస్తవులుకానీ, ముసల్మానులుకానీ, పార్సీలు కానీ, వారు యెంతటినద్బుద్ధి కలవారైననుకానీ,—యీకలుషితమైన ప్రస్తుతవాతావరణములో యీ హిందూవిభేదాలలో చేయికలుగ చేసుకొనకుందురు గాక. సనాతనులను మెచ్చుకొనిన సంస్కారులు సంశయింతురు. సంస్కారులను మెచ్చుకొనిన సనాతనులు పసందు చేయరు. మరికొంతకాలానికి ఉభయులు నుకలసి పిలువని పేరంటములో చేరిఅనుగని అభిప్రాయాలను ఇచ్చు వారల చర్యలను గర్హించుకొనుటయు సంభవము కావచ్చును. సర్. సీ. పీ. గారు సనాతన సంస్కారులు అనువిభేదాలను పాటింపక పక్షమును వహింపక ఉత్తమ రాజనీతిని ప్రకటించి దానిని కార్యరూపమున ఉంచినందులకు అందరి ప్రశంసకును పాత్రులైనారు.

తిరువాన్కూరు సంస్థానములో కావింపబడిన బాల్యవివాహ నిషేధశాసనమునకై మేము తిరువాన్కూరు ప్రభుత్వాన్ని తిరువాన్కూరు ప్రజలను గాఢముగా అభినందించు చున్నాము.

---



# చతుర్థ ప్రజావిద్యామహాసభ

## వినాయకరావుబారిష్టరుగారి అధ్యక్షకోపన్యాసము

- ప్రతివిద్యార్థికి మెట్రికువరకు మాతృభాషలో విద్యచెప్పించవలెను.
- హిందూ బాలబాలికలవిద్య పూర్తిగావెనుకబడియున్నది.
- మతవిద్యలందరికిని ఒకేవిధంగా ఉండవలెను.
- విద్యపై గ్రంథాలయాలపై అఖాడాలపై నిరోధాలుతీసివేయవలెను.
- వందేమాతరం విద్యార్థులమొరల నింతవరకును వినకపోయిరి.

---

పర్భణీలో జరిగిన చతుర్థవిద్యామహా సభాధ్యక్షతవహించిన వినాయకరావు గారితమఅధ్యక్షోపన్యాసమును ఈవిధముగావినిపించిరి

ప్రజాపక్ష విద్యామహాసభ యేర్పాటు అయ్యి పంన్నెండేండ్లుఅయ్యెను. మొట్టమొదటమారు ఈ మహాసభా జిల్లాలోజరుగుచున్నది. ఖాన్గిబళ్ళనిషేధముయేర్పడినసుండి యీమహాసభ యేర్పడినది. విద్యాదానముఅన్నిటిలో ఉత్తమదానమసర్కారివారికెలవులేనిది, క్షుధార్తులకు అన్నము పెట్టకూడదనియు దప్పిగొన్న వారికి పానీయమియ్యకూడదనియు రోగులకు మందియ్యకూడదనియు అజ్ఞాపించినయెట్లుండునో విద్యాదానముచేయకూడదనటట్లేయుండును. అమాయకులైనపిల్లలు దిక్కులేవారై విద్యలేనివారై యీఖాన్గిబడుల నిషేధపుగక్షివలనపుంజవలసివచ్చెను. యెన్నివిధముల మొరపెట్టిన ప్రభుత్వమునారుపినదందువయీమహాసభయేర్పాటుకావలసివచ్చెను. యీమహాసభవారి ప్రయత్నాలమూలమున ఖాన్గిబడుల గక్షితిసివేయకున్నను దానికాఠిన్యము తగ్గింపబడినది. యీగస్తి యెంతవరకుండునో అంతవరకు మనరాష్ట్రమునకు కళంకముఅంటియుండును ఇతరవిద్యాసమస్యలనుగురించికూడా యీమహాసభవారు చర్చించియుండిరి. అందు మొదటిమహాసభలో విద్యాపరిస్థితులనువిచారించుటకు కొకకమీషన్ యేర్పాటుకావలెననికోరియుండిరి మెకంజికమిటీయేర్పాటుఅయ్యెను. అందుప్రజలపక్షమున అభిప్రాయముకనుగొనబడును,

ప్రతివిద్యార్థికిని కనీసము మెట్రికువరకును వారిమాతృభాషలో విద్యచెప్పించవలెనని యీమహాసభవారి నిశ్చితాభిప్రాయమైయున్నది మెకంజికమిటీవారు యీసిద్ధాంతమునుఒప్పుకొనిరి కాని కార్యరూపముదాల్చలేదు, ౧౩౪౭ ఫసలీలో బాలికలకుమాత్రము మాధ్యమికతరగతివరకు మాతృభాషలోవిద్యచెప్పించుటను ఒప్పుకొనిరి.

ప్రతివిద్యాపీఠములోను పరీక్షలలో విశేషభాగము బాలురుతమమాతృభాషలో జవాబులువ్రాయుటకవొప్పుకొన్నారు. మనవుస్మానియా విద్యాపీఠముకూడ యీసిద్ధాంతమును ఇతరులకస్వీకొనవలసివచ్చును కొన్ని సంవత్సరములకు పూర్వము ఆకస్మాత్తుగా నిజామకాలేజిలో విద్యార్థుల ప్రవేశముతగ్గించబడెను, ఆదుపై ఉప్పటివారంగ్రిగాలితో మొరపెట్టుకొనబడెను, యేసోవొకవిధముగాఇబ్బందితగ్గింపబడెను— ఇప్పుడు బాలికలకు వృత్తావిర్బంధవిద్యగాచేసి విషయములో యీమహాసభవారు మొరపెట్టుకొనుచున్నారు.

విద్యాశాఖవారి ౧౩౪౭ ఫసలీ నివేదికలో ౧౦౦౦ జనసంఖ్యగల ప్రతిగ్రామములో వొకపర్కారి పాఠశాలయేర్పాటు చేయుదమని చెప్పయున్నారు. మనరాష్ట్రములో ఇంచుమించు ౨౨౦౦ గ్రామాలున్నవి ఇప్పుడు సర్కారి పాఠశాలలున్నవి అందులో ౩౪ పాఠశాలలో నగరాలలోవున్నవి అవగా ఇగు పైవేగ్రామాలను గాను ౪౫౦౦ పాఠశాలలున్నవన్నమాట.

గడచిన అనువదియేండ్ల విద్యాసర్కారు చూచినట్లయిన అపారమైనవిద్యావ్యయమును చూచినట్లయిన మనకుఆపారమైన ఆశ్చర్యముకలుగును, క్రీ శ. ౧౮౮౧ లో మనప్రభుత్వమువారు రెండుపాళ్ళలక్షరూపాయిల మాత్రమేవ్యయముచేసిరి అప్పుడు శియ్యింటికి రెండుమాత్రమె విద్యనేర్చినవారుమాత్రమే యుండిరి అందులోనుహిందువులలో ౧౦౦కి ౪౫మంది అక్షరాస్యులును ముసల్మానులలోను ౧౦౦కి ౫౫మంది వుండిరి

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧౮౯౧లో | విద్యకు | ౩౦౦౦౦౦ | రూలు | వ్యాపకము | ౧౦౦కి ౪౮ |
| ౧౯౦౧లో | ,, | ౬౦౦౦౦౦ | లు | ,, | ౧౦౦కి ౫౪ |
| ౧౯౧౧లో | ,, | ౧౦౦౦౦౦౦ | పైగా | , | ౧౦౦కి ౫౪ |
| ౧౯౨౧లో | , | ౬౫౦౦౦౦ | | ,, | ౧౦౦కి ౭౫ |
| ౧౯౩౧లో | , | ౯౦౦౦౦౦౦ | | ,, | ౧౦౦కి ౭౫ |

పైకాలములో హిందువులలో విద్యావ్యాపకము తక్కువగను ముసల్మానులలో యెక్కువగను వున్నట్లు ౧౯౩౧లో హిందువులలో ౧౦౦కి ౩౨, ముసల్మానులలో ౧౦౦కి ౧౦ వరకుండెను. ఇప్పుడు విద్యకై ఒకకోటిపన్నెండులక్షల రూపాయిలు వ్యయముచేయుచున్నారు. విద్యావ్యాపకము మున్నటి జనాభాప్రకారము ౧౦౦కి౫మందిఅని అంచనావేయుబడినది. యీ డెబ్బదియేండ్లలో రెండుపావులక్షలనుండి ఒకటింపావుకోటి రూపాయిలవరకు వ్యయము హెచ్చినను విద్యావ్యాపకమమాత్రము తక్కువగానే చేసెస్సున్నది. ఇదివొక గారడివిద్యగావున్నది. కారణమేమనగా వ్యయములో విశేషభాగము ఇంద్రభవనములకును మితిమీరినజీతాలకును కళాశాలలవిద్యకును వ్యయము చేయబడుచున్నది బ్రిటిషుసామ్రాజ్యతత్వములో పైఅధికారులకు గొప్పజీతాలిచ్చునట్లుగా ఇక్కడకూడ ప్రఫెసర్లకు ఇతరస్పెషలిస్టులకు పెద్దబంగ్లాలను బీదలకిండ్లను మిదువిటులుగొల్పునట్లుగా వ్యయము చేయబడుచున్నది. హిందూస్థానములో ప్రతిసగటు వాడు ఆయము కొన్నిపైసలమాత్రమే—అట్టిచోఇట్టిజీతాలిచ్చుట మనకు వ్యయమువ్రాతిమే యెక్కువఅయినది.

బ్రిటిషుఇండియాపద్ధతి మనవారును అంధపరంపరంగా అనుకరించియున్నారు—అక్కడఇంగ్లీషుకు ప్రాధాన్యమిచ్చినట్లు ఇక్కడ ఉర్దూకు ప్రాధాన్యమిచ్చుటయే కనుపించుచున్నది— దీనిఫలితమే మన బ్రిటిషుఇండియాలో క్లార్కులు శిద్ధమైనట్లు ఇక్కడ మునిషీలు శిద్ధమైనారు మనవిద్యాపీఠము వారు మిషనలో సామాను శిద్ధము చేసినట్లుగా గ్రాడ్యుయేట్లను సిద్ధముచేసి కట్టలుకట్టలుగా మార్కెటులో పడవేసినారు—అవసరముకన్న మించి వస్తువులు తయారుఅయినప్పుడు వాటివిలువ తగ్గిపోవును— ఇట్టివిద్యావ్యాపకమువలన విద్యావంతులైనవారికి ప్రభుత్వోద్యోగములుదొరుకక నిరుద్యోగి సమస్య హెచ్చుచున్నది— దీనినిమాన్పుటకై సాంకేతిక శాస్త్రీయ వృత్తివిద్యచెప్పించవలెనని ప్రచారము చేయుచున్నారు—కాని అదియు కొంతకాలమునకు వ్యర్థప్రయత్నమగును— అందుకు మారుగా వుద్యోగుల పెన్షన్ కాలము వారికి వారివుద్యోగకాలము హెచ్చింపకుండ నుండవలయును—పరిశ్రమలను ప్రభుత్వమువారు నడిపించవలెను—

ఈమహాసభవారు తమ మొట్టమొదటిసభలోనే ప్రాథమికవిద్యను నిర్బంధముగా చెప్పుటకు తీర్మానించియుండిరి—ఇప్పుడు మన రాష్ట్రములో విద్య నేర్వదగిన వయస్సుగల బాలురలో నూటికిఇరువదిమందిమాత్రమే చదువుకొనుచున్నారు. అందుచేత నిర్బంధవిద్యావిధానము అత్యవసరము బ్రిటిషుఇండియాలో కొన్ని ప్రాంతములలో ఒరోడావటి కొన్నిసంస్థానములలోను నిర్బంధవిద్యావిధానము జరుపబడుచున్నది— మనరాష్ట్రములలో అవసరవ్యయముకు తగ్గించిన మిగిలినవిద్యకు అవకాశమేర్పడును మన ప్రభుత్వమువారికి ఇతరకార్యములకుగాను కొత్తకొత్త స్కీములకుగాను లక్షలకొలది దొరుకుచుండినప్పుడు యీనిర్బంధవిద్యకు కొన్నిలక్షలు దొరుకుట దుర్లభముకాదు—కాని మనప్రభుత్వ దృష్టిలో యీ స్కీము లోనున్నది—తాలూకాశాసనసభలో నిర్బంధ ప్రాథమికవిద్యాశాసనము ప్రవేశపెట్టబడవచ్చినను మా తెల్సినదికాదు కేశవరావుగారు మరియు నాయకులు దీనికై పోరాడి—మా తరపునను పోరాడుచున్నాము— మాపిల్లలకిమూలకరకను యీసమస్యను మండువముకాను, మాపిల్లలకు మాతృభాషలోనే విద్యచెప్పించవలెను— మేము మహాత్ములమో క్రైస్తవులమో అయ్యియుండిన ఎవరాట చెప్పియుండును—ఉన్నతపాఠశాలలో పాఠ్యపుస్తకముల మాతృభాషలలోనే చెప్పవలెను ఒకవేళ ఏకపుస్తకము ఇప్పుడు ఉండకపోయినచో వాటి పుస్తకములను పొందుచున్నా వారియైతే ముందుభాషలో పరిభాషలు వాడవచ్చును—బొంబాయి మద్రాసు రాష్ట్రములలో తెలుగు కన్నడముమహారాష్ట్రభాషలలో పుస్తకములు తయారుఅయ్యి వాటిలోనే పరీక్షలు జరుగుచున్నవి— మన విద్యాశాఖవారును ఆపుస్తకములను యేర్పాటుచేయవచ్చును— ఇంకా కళాశాలలోని విద్యాపద్ధతిని గురించి ఆలోచింపవలెను—ఉస్మానియా విద్యాపీఠములో ఇప్పుడు ఇంగ్లీషుఉర్దూభాషలు నేర్పబడుచున్నవి—కాని ఇవిరెంటిలో ఇంగ్లీషులో విద్యచెప్పించుట మేలని నాఅభిప్రాయము—యెందుకనగా బ్రిటిషు ఇండియాలో అన్ని విద్యాపీఠములలోను ఇంగ్లీషులోనె విద్య చెప్పించుచున్నారు— మరియు, సాంకేతిక పదములు ఇంగ్లీషులో నేర్పున్నవి— హైదరాబాదు ఉర్దూవును ఒక కొత్తసిద్ధాంతము వినబడుచున్నది— చుట్టుపట నుండు సంస్కృతికి విరుద్ధముగానొక కొత్త సంస్కృతి ఉండనేరదు— హిందూస్థానమంతయు నొకజాతికి చేరిన సిద్ధాంతమును అందరు ఒప్పుకొనవలయును. మనరాష్ట్రములో పన్నులకు మతవిద్యయు ఇతరులకు వారిమతవిద్యయు చెప్పించియున్నారు. అందరికి నొకేపద్ధతిపైన మతవిద్యయో లేక నీతి విద్యయో చెప్పించవలెను,

ఇటీవలనే విద్యాశాఖయొక్క ఉపాధికారి (నాయబునాజిము)గారు ఒకవోఉపన్యసించుచు ఇకముందు మెట్రికు పరీక్షకు ఇంగ్లీషు ప్రాధాన్యతనుతీసివేసిఉర్దూకు ప్రాముఖ్యతను ఇత్తుమని సెలవిచ్చియుండిరి, అనగాఇంతలో మెట్రికుతరగతులుమూసివేసి ఉస్మానియా మెట్రికు నేర్పిరవరకురనియు నిజాముకాలేజిని మూసివేయుదర అర్థముగుచున్నది. ఇట్లుచేసిన ప్రజలకుకష్టకారిగానుండును

ప్రభుత్వమువారు పాఠశాలలో ఐచ్ఛికభాషను ఏర్పాటుచేసిన పద్ధతిని చూడగాహిందువులకు స్థానములియ్యనట్లుకనుపించుచున్నది హిందీకిసరియగు స్థానము లేదు దానికిని స్థానమియ్యవలెననికోరుచున్నాను సంస్కృతభాషకును యెక్కువప్రోత్సాహము కలిగించవలెను ఇప్పటిఉర్దూలో పార్సీఅరబీలను యెక్కువకలిపివారు ఆపద్ధతినితీసివేసి సులభమైనఉర్దూభాషకుప్రాధాన్యమియ్యవలెను.

స్త్రీవిద్యలో ఉర్దూప్రాధాన్యమిచ్చుటచేత హిందూబాలికలవిద్య చాలావెనకబడివున్నది ౧౩౪౭ ఫసలీవిద్యానివేదికమచూచిన ఉస్మానియాఉన్నతపాఠశాలలోని బాలికలలో ౧౩౪౦ముస్లింబాలికలును కేవలము ౯౭ మందిహిందూబాలికలనుమాత్రమేఉన్నట్లు విశదమగుచున్నది. మాధ్యమిక స్త్రీపాఠశాలలో ఉర్దూనిర్బంధము గా చెప్పిన పాఠశాలలను సర్కారువారుకూడముచేయుట దనిరాకరించియున్నారు. హరిజనులవిద్య చాలవెనుకబడివున్నది, వారికిసర్వవిధములసహాయముచేయుట చాలాఅవసరము తిరువాన్కూరు కొచ్చినుసంస్థానములలో హరిజనులకు వసతిగృహములుయేర్పాటుచేసి వారికిబట్టలుకూడ ఉచితము గాయిచ్చుచున్నారు అట్టిపద్ధతినిక్కడకూడా యేర్పాటుచేయవచ్చును. ప్రభుత్వమువారు అఖాడాలపైఅనగా వ్యాయామశాలలపైనిరోధ్యము ఏర్పాటుచేసినారు. ఖాన్గీబళ్ళపైఆక్షలుపెట్టినారు గ్రంథాలయములపై ఒకకన్నుపెట్టవలెనని ఆజ్ఞాపించియున్నారు, ఇట్టివిధులన్నియు నాగరిక దేశములలోను చేయుటలేదు ఇవివెంటనేతీసివేయవలెను వందేమాతరం విద్యార్థులవిషయములో ప్రభుత్వమువారు చాలా కాఠిన్యమువహించిరి యీవిషయములో ఒకవిచారణసంఘము యేర్పాటుచేసి విచారణచేసినబాగుండును—

---

## పరోపకారిణి బాలికా పాఠశాల

సికింద్రాబాదు

ఒకవిశేషకరి యిట్లు వ్రాయుచున్నారు:—

శ్రీ గద్వాల మహారాణిసాహెబాగారి యాజమాన్యమున, సికింద్రాబాదు పరోపకారిణి బాలికాపాఠశాల విద్యార్థినులు చిత్రాటాకీస్ హాలులో యేప్రిలు ౫వ తేదీ శనివారము సాయంత్రము ౬ గంటలనుండి ౯-౩౦ గంటలవరకు "సావిత్రి" నాటకమును ప్రదర్శించిరి. పాఠశాల సహాయార్థము యీనాటక మేర్పాటుపబడెను. హాలులో స్త్రీలకు ప్రత్యేకముగ నేర్పడిన గ్యాలరీనుండి యీనాటకమును వీక్షించిన శ్రీ గద్వాల మహారాణిసాహెబాగారేగాక యింక యితర ప్రముఖులుగలరు, వీరిలో నగరం సంస్థానాధీశులగు శ్రీ రాజా రాఘవేంద్రరావు బహద్దరు గారును. రాజా బహద్దరు వెంకటరామారెడ్డి గారును, దివాన్ బహద్దర్ అరవమూడు అయ్యంగారును, దివాన్ బహద్దర్ శ్రీ వేణుగోపాల్ గారును, న్యాయమూర్తులగు శ్రీ ఆర్.యస్. నాయకుగారును, వేలురావుసాహెబు బూరుగుమహాదేవు, శ్రీ దండు రంగయ్యగారు మొదలగు ప్రముఖులుగలరు. పాఠశాల స్థాపకురాలగు వీరమ్మగారి ధారాపటమును నాటకరంగముయొక్క యెడమ ప్రక్కన ప్రాముఖ్యస్థానమలంకరించెను. నేటుకయందు ముఖ్యముగ నాకర్షణీయమగు విషయము నాట్యము. కథానాయకయొక్క పాత్రపోషణ కడుఅద్భుతముగాను, సహజముగాను, ఆకర్షణీయముగాను యున్నది. నాటకప్రదర్శన పర్యంతము, బాలబాలికలసౌష్ఠవమును గమనింపవలెను. వారందఱు పదమూడుసంవత్సరముల లోపు బ్రాయముగల ముక్కుపచ్చలారని చిన్నవయస్కులు. పాటలు, సంభాషణ కడురమ్యముగనున్నవి. కథయొక్క శోకరసమును తగ్గించుటకుగాను, హాస్యరంగ మొకటి యేర్పాటుగావింపబడెను. ఇది ముదుసలిభర్తయు వయస్సుభార్యయొక్క సంభాషణ ఇది ప్రేక్షకుల రంజింపజేసెను.

కడపటిరంగము ప్రదర్శింపకపూర్వము, శ్రీ కె. రంగాచారి యం,యె.యల్.యల్.బి గారును. శ్రీ యస్.శ్యామారావుగారును నుపన్యసించిరి. శ్రీరంగాచారిగారు శ్రీగద్వాలమహారాణిగారు యీనాటకమునకు ప్రాపకులగుట వంశపారంపర్యముగ గద్వాలసంస్థానాధీశులు విద్యనపోషించుటను వెల్లడిచేయుచున్నదనిరి. శ్రీ శ్యామారావుగారు పరోపకారిణి పాఠశాలకు శ్రీ రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారు యింకను. శ్రీ శేషాచారి గారు, కీర్తిశేషులగు రాజాబహద్దర్ ముస్త్యాల వెంకటకృష్ణయ్యగారు, న్యాయమూర్తులగు ఆర్.యస్. నాయకుగారు, కీర్తిశేషులగు రావుబహద్దరు కృష్ణఅయ్యంగారు చేసిన సహాయమువిషయమై ప్రస్తావన గావించిరి. తదుపరి రావుసాహెబు ఏ.కె.వీరస్వామి యం.బి.యి యిగారు సత్యవంతునిపాత్రధరించిన బాలికకు హైదరాబాదువాస్తవ్యులగు శ్రీ రాజయ్యగారిచే బహూకరింపబడిన బంగారుపతకమును యిచ్చిరి.

## కీ౹౹శే౹౹ గుజ్జరుగోపాలుగారు

సికింద్రాబాదు కాపురస్థులు, బొంబాయి బట్టలవర్తక ప్రముఖులును, ప్రజ్ఞావంతులును. వ్యాపారులును, (పేరుపూరికులనులగు), కీర్తిశేషులు గుజ్జరుగోపాలుగారు విక్రమనామసంవత్సర ఫాల్గుణ బ౹౹౭ం లు గురువారం రాత్రి ఒకగంటకు (అనగా ది ౨౭-౩-౪౧ తేదీ) దివంగతులైనందుకు బొంబాయిబట్టలవర్తక గుమాస్తా సంఘమువారు విచారమును తెలుపుచు, వారిఆత్మకు శాంతికల్గునట్లు శ్రీభగవానుని ప్రార్థించుచున్నారు,

ఇట్లు
కత్తూరుపల్లివెంకయ్య
కార్యదర్శి
సికింద్రాబాదు బట్టలవర్తక గుమస్తాలసంఘం



## గ్రంథాలయశిక్షణ తరగతులు

మూడవ వేసవి పాఠశాల

పనమటలంక (వయా-బెజవాడ) ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యదర్శి పా. నాగభూషణంగారిట్లు తెల్పుచున్నారు:-

ఈశిక్షణతరగతులయందు గ్రంథాలయనిర్మాణము, గ్రంథాలయనిర్వహణము, పత్రికాపఠనము నకు వలయు సామాన్యవిజ్ఞానము, తెలుగు సంస్కృత హిందీవాఙ్మయములచరిత్ర, ఆంధ్రుల చరిత్ర-వయోజనవిద్య-అక్షరాస్యతా ప్రచారము ప్రత్యేకగ్రంథాలయసమస్యలు, ప్రాథమికహిందీ పాఠములు-మున్నగునవి ముఖ్యములు నేర్పబడును.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు(ఎం.ఏ.) దిగవల్లి వెంకటశివరావుగారు (బి.ఏ.,బి.ఎల్.) డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు (ఎం.ఏ,పి.హెచ్.డి.) కవిరాజా విశ్వనాథసత్యనారాయణ గారు (ఎంఏ), ఓరుగంటి వెంకటేశ్వరశర్మ గారు (ఆంధ్రయూనివర్సిటీ హిందీఉపన్యాసకులు), శొంఠారావుగారు (ఎం.ఏ.,ఎల్.టి.), అయ్యంకి వెంకటరమణయ్యగారు మున్నగువారలు ఉపన్యాసములిచ్చెదరు.

## ముదిరాజ సభ

నిజాంరాష్ట్ర ముదిరాజకులసోదరుల సర్వతోముఖాభివృద్ధికై హైదరాబాదు నగరమున రానున్న తిరునెల ౯,౧౦,౧౧ తేదీలలో నిజాంరాష్ట్ర ముదిరాజమహాసభను జరుపనెంచి యాహ్వానసంఘమువారు చురుకుగా పనిచేయుచుండుటను, ప్రచారకసంఘ మేర్పడిజిల్లా గ్రామములలోనుపసంఘముల నేర్పరచుటకును, జిల్లాలలోవివిధప్రాంతములనుండి ప్రతినిధులుత్సాహమును చూపుచుండుటను కరపత్రములవలనను, పత్రికలవలనను తెలిసికొని మేము మిక్కిలి సంతసించుచున్నాము. మహాసభోద్దేశ్యములను, కార్యక్రమమును నెరవేర్చ కులసోదరులందరు సర్వవిధములతోడ్పడి మహాసభను దిగ్విజయముగ కొనసాగింప ప్రార్థించుచున్నాము.

## మున్నూరుకాపు విద్యార్థి వసతిగృహము

(హైదరాబాదు-దక్కన్)

మున్నూరుకాపు విద్యార్థులసౌకర్యార్థమై నిజాంరాష్ట్ర మున్నూరుకాపు యువకమండలియాజమాన్యమున లింగంపల్లికి కొంతదూరములో ఆడిగిమెట్టుకోడ్డువద్ద గొండ్లాల పెంటయ్యగారి విశాలమైనభవనమునందు వచ్చే అమర్దాదుమాసారంభమునుండి వసతిగృహము నిర్వహింపబడును.

విద్యార్థులకు ఆరోగ్యకరమగుభోజన మొసంగబడును. ప్రతివిద్యార్థికి నెలకుకీసు ఎనిమిదిరూపాయిలు బీదవిద్యార్థులకు ఫీసుతగ్గించబడును. ముఖ్యముగ జిల్లాలవారు ఈ విద్యాసౌకర్యముకలన లాభమునుపొందగలరని ఆశించుచున్నారము. చేరదలచువిద్యార్థులు ఈనెల ఆఖరువరకు ఈక్రింది చిరునామాకు తెలియచేసి అంగీకారమునుపొందవలెను.

ఇట్లు
ఎఱ్ఱం సత్యనారాయణ,
ఈసామియాబజారు,
హైదరాబాదు-దక్కన్

## శ్రీరామనవమి- నల్లాలనీళ్లు

ఇదిహిందువులకదరికిని ముఖ్యమైన పండుగ అట్టిపండుగదివసమున నగరములో నల్లాలను పదిగంటలకు అపుదలచేయడంవలన అందరికి నీళ్ళకు చాలాయిబ్బంది కష్టముఅయినది. శ్రీరామనవమి హిందువుల ముఖ్యపండుగలలోఒకటి. ఈనగర సఫాయివారికి ఎవరూ చెప్పలేదుకాబోలు, ఇకముందైనా హిందూపండుగ దివసములలో అన్నిటియందుకూడా దినమంతానగరంలోనల్లాలలో నీళ్లువిడచే ఏర్పాటుచేయుదురనికోరుచున్నాము,

ఇట్లు
నగరవాసి

## సింధులో 'సమష్టినియోజక వర్గాలు

కరాచీ, ఏప్రెలు ౪

సింధులోప్రధానమంత్రి ఖానుబహద్దరు అల్లాబక్సుగారి స్వస్థలమైన శికార్పూరులో పురపాలకసంఘం ఎన్నికలు సమష్టినియోజకవర్గ పద్ధతిలో జరుగును. ఇండియాలో యీపద్ధతి మరెచ్చటనులేదు. ౧౮స్థానాలకు ౧౭మంది ముస్లిములు నామినేషను పేపర్లను దాఖలుచేశారు ఈయెన్నికలకు ముస్లిములనిలువవద్దని మూస్లింలీగువారుచేసిన ప్రకటనను ముస్లిములు లెక్కచేయలేదు. ఈ నెల ౨౫,౨౭ తేదులలో వోటింగుజరుగును, సుక్కూరు, హైదరాబాదు, జకోబాదు మొదలయిన మ్యునిసిపాలిటీల ఎన్నికలుకూడా యీపద్ధతిప్రకారమే జరుగును, సమష్టినియోజకవర్గాల బిల్లును గతకాలంలో అల్లాబక్సుమంత్రి వర్గంవారే ప్రవేశపెట్టిరి. బందే అలిఖాను మంత్రివర్గంవారి కాలంలో ఆబిల్లు ఆమోదించబడెను. ఇప్పుడు దానిని అమలుజరిపే అవకాశం మళ్లీ అల్లాబక్సు మంత్రివర్గానికే లభించినది.

## బాల్యవివాహ నిషేధ బిల్లు

తిరువాన్‌కూరు శాసన సభలో చర్చ

సభవారికి యువతీమణుల మహాజరు

త్రివేంద్రము, ఏప్రెల్ ౫

నేడు తిరువాన్‌కూరు శాసనసభయగు శ్రీ చిత్రాస్టేట్ కౌన్సిలులో బాల్యవివాహ నిషేధ శాసనముపై చర్చప్రారంభమయ్యెను, ఈసమయమున తిరువాన్‌కూరువందలి యువతీమణులు బాల్యవివాహములవల్ల కలిగిన నష్టములను పేర్కొనుచు సభవారికి పెద్దమహాజరు పెట్టింది ఈమహాజరు సభలో చదువబడెను. సభవారు బిల్లు సూత్రాలను ఆమోదించిరి. తక్కిన సూత్రాలను విచారించుటకు మంగళవారమువాడు సమావేశమగుదురు, సవరణలన్నియు వీగిపోయెను. ప్రభుత్వమువారు తటస్థముగా నుందురని దివానుఅధ్యక్షుడు సర్.సి.పి, రామస్వామి అయ్యరుగారు ప్రకటించిరి.

## లిబియాకు జర్మను సామగ్రి

మధ్యధరా బ్రిటిష్‌వారిచే ముంచబడుచుండుట

లండను, ఏప్రిలు 4

ట్రిపోలీ మార్గమున లిబియాకు పోవుచున్న జర్మను సేనలు, సామగ్రులన్ని యు సురక్షితముగా గమ్యస్థానము చేరుటలేదు జనవరి ౧ తారీఖునుండియు బ్రిటిషు జలాంతర్గాములు మధ్యధరా సముద్రములో ౧౦౫ వేలటన్నుల శత్రునావలను ముంచివేసినట్లు ప్రకటింపబడెను. దీనిలో చాలమట్టుకు ట్రిపోలీకై యుండును, బ్రిటిషువిమానములచే ముంచబడిన నావలు ఈ లెక్కలో చేరలేదు శత్రుసామగ్రులు ఇటలీపశ్చిమమునున్న సాలర్నో రేవునుండి బయలుదేరి సిసిలీని చుట్టుకొని ట్యునీసియా సముద్రములోనికి వెళ్లెను, అక్కడినుండి యొట్లో పరుగులను ట్రిపోలీచేరుటకు ప్రయత్నింపబడెను. ఈమార్గమున శత్రువులు ప్రయాణము చేయుటచేత బ్రిటిషువారికి కష్టమేర్పడెను ఐనను చాలసరుకును బ్రిటిషువారు నాశనము చేయగలిగిరి, బెంఘాజీని బ్రిటిషువారు రేవుగా ఎన్నడును పయోగించలేదనియు, శత్రువును చక్కజేసినమీదట గూడ జర్మనులు దానిని రేవుగా నుపయోగించు నవకాశము లేదనియు నిప్పుడు ధృవ పడినది.

ఎజ్జియసముద్ర ప్రాంతమున ఇటాలీయులను యింకను 3 డిస్ట్రాయర్లు, రెండుటార్పెడోబోట్లు, రెండు మూడు జలాంతర్గాములు నున్నట్లును, వీనిపై బ్రిటిషువారు వెదుకుచున్నట్లును నమ్మబడుచున్నది.

## సిరియా అధ్యక్షుని రాజీనామా

విసీ, ఏప్రిల్ 3

సిరియా ప్రభుత్వాధిపతిగా ఖలేద్ బేఅజెం గారు నియమింపబడినందుకు అసమ్మతి తెలుపుచు, సిరియా అధ్యక్షులగు ఎమిలీ ఎడ్డీగారును, సెక్రెటరీ ఆఫ్ స్టేటుగా పనిచేయుచుండిన మాన్సు బెయి హూం గారును రాజీనామా యిచ్చిరి, వీరిపనులను జనరల్ అర్లాబాపీగారు తాత్కాలికముగా నిర్వహించుచుందురు.

## జర్మనునౌకాదళ ప్రతినిధి

అమెరికానుండి వెళ్లిపోవలసినదని ఉత్తర్వు

న్యూయార్కు, ఏప్రిల్ ౫

అమెరికా సంయుక్త రాజ్యప్రభుత్వంవారు ఆ దేశములోని ఇటాలియను రాయబారి కార్యాలయములో ఇటాలియను నౌకాదళ ప్రతినిధిగా పనిచేయుచున్న వానిని వెళ్లిపోవలసినదని ఉత్తరువుచేసిరి జర్మను రాయబారి కార్యాలయములోని నౌకాదళ ప్రతినిధి గూడ వెళ్లిపొమ్మందురని తెలియుచున్నది.

## ఆంగ్లో-జపాను సంబంధము

బ్రిటిషు రాయబారి జపానుమంత్రితో మాట్లాడుట

టోకియో, ఏప్రిల్ ౪

జపానులో బ్రిటిషు రాయబారి జపానురాయబారి జపానుఉపవిదేశాంగమంత్రిని చూచి, జపాను-ఇంగ్లండు సంబంధములనుగూర్చి మాట్లాడిరి తూర్పు మధ్యధరా సముద్రములోని స్థితిగతులను గూడ బ్రిటిషు రాయబారి జపానుమంత్రికి తెలిపెను.

## జర్మనీలో అరెస్టు చేయబడిన అమెరికను

అమెరికా ప్రభుత్వపు ఆక్షేపణ

వాషింగటను, ఏప్రిల్ ౪

జర్మనీలో బర్లినునగరమందున్న అమెరికను రాయబారి కార్యాలయంలో ఉన్న ఉద్యోగియగు స్టూవర్టు హెర్మను గారిని జర్మను అధికారులు అరెస్టు చేసిరి ఈవిషయమై ఆక్షేపించుచు జర్మనీ ప్రభుత్వానికి అమెరికా ప్రభుత్వము తెలియజేసినది. అతనిని అరెస్టుచేయుటకు పూర్వము జర్మను ప్రభుత్వమువారు జర్మనీలోనున్న అమెరికను రాయబారికి ఆ విషయమై తెలియజేయలేదు. ఏప్రిల్ 3 తేదిన జర్మనులో ఉన్న అమెరికనులు చాలమంది అరెస్టు చేయబడిరి. వారిలో హెర్మనుగారుకూడ. కొలదికంటకాలం వారు జర్మను పోలీసులచే నిర్బంధింపబడి యుండిరి, కాని తరువాత విడిచిపెట్టబడిరి

## అమెరికాలో ఇటాలియను నావికుల కుట్ర

అమెరికను ఫెడరలు కోర్టుతీర్పు

న్యూఆర్లియన్సు, ఏప్రిల్ 3

అమెరికా రేవులో ఉన్న రెండు ఇటాలియను నావల తాలూకు ౨౮ అఫీసర్లను నావికులున్ను ఆదివారంనాడు పట్టుకోబడిరి. అమెరికా సంయుక్త రాజ్యప్రభుత్వ సైన్యములకు కుట్ర చేయుచున్నారను నేరమువారిపై ఆరోపింపబడెను వారు అట్టి నేరస్థులని అమెరికా ఫెడరలు కోర్టు గాండుజూరీ నిర్ణయించినది.

## బ్రిటిష్ సేనాధిపతి

అమెరికా నౌకాధిపతితో మాట్లాడుట

లండను, ఏప్రిల్ ౪

దూరప్రాచ్య సర్వసేనానిగారగు ఎయిర్ మార్షల్ సర్ రాబర్టుబ్రూక్ పోఫాంగారు మనీలా నుండి హాంకాంగు వెళ్లి అమెరికావారి ఆసియా నౌకాధిపతితో సంప్రదించెను ఆయనతిరిగిమనీలా వారములో జాలలోవచ్చును.

## ఎజ్జిసముద్రంలో ఇటలీ యుద్ధ నావలు

బ్రిటిషువిమానములచే నాశనము చేయుట

లండను, ఏప్రిల్ ౫.

ఎజ్జిసముద్రములోని ౫ ఇటలీయుద్ధ నావలపై అనగా డిస్ట్రాయర్లపై నిన్న శనివారము బ్రిటిషు విమానములు కావించిన దాడులు మధ్యప్రాచ్య సైనికాధికారులచే నొక ప్రకటనలో వర్ణింపబడుచున్నవి,

మాసావాహార్బరులోని ఇటలీయుద్ధనావల తప్పించుకొని పోకుండ బ్రిటిషువిమానములు జాగ్రత్తగా కనిపెట్టియుండెను. ౫ ఇటాలియను డిస్ట్రాయర్లు మాసావాహార్బరునుండి తప్పించుకొనిపోవుట కనిపెట్టబడెను. అవి ఎర్రసముద్రములో కనబడెను నౌకాశాఖవారి జలవిమానములును బ్రిటిషువిమానములును వానిపై దాడిగావించెను. ఒక విమానము, ఒక డిస్ట్రాయరు వద్ద చాలబాంబులను వేసెను మరియొక డిస్ట్రాయరుపై బాంబుపడగా అది ప్రేలి, మునిగిపోయెను. దానిలోవారు బోట్లలో ప్రాణముదక్కించుకొనిరి. మరిరెండు జిడ్డాక్షీణమున ఒడ్డుపట్టెను ఈ నావలలోనివారుకూడ బోట్లలో ప్రాణముదక్కించుకొని పోయిరి, ఈయుద్ధనావలపై బాంబులువేయబడెను. ఈయుద్ధకార్యములలో ఒక విమానం భూమిపైదిగెను దీనిలోవారిని రక్షించు నుద్దేశ్యముతో మరియొకటి దాని ప్రక్కదిగెను కానియిదితిరిగి పైకివెళ్లజాలకపోయెను. ఈ కారణముచేత విమానదళములోని తక్కినవిమానములు క్రిందికి దిగి ఈ రెండు విమానములలోనివారిని రక్షించి తమతమ తావులకుచేరెను.

84 TABLETS LUCO SECRIN A SPECIFIC TREATMENT FOR FLUOR ALBUS

# లాకోసెక్రిన్

బిళ్లలతో కుసుమరోగము

౪ రోజులలో కుదిరినది.

వైద్యప్రపంచమున యీనూతనౌషధము శ్లాఘించినది.

మొన్న మొన్నటిదాకా స్త్రీలకు చాలా బాధాకరమైనదియు నష్టదాయకమైనదియునగు కుసుమరోగము పూర్తిగా నయమగుటకు వీలుండకునులోంగలేదు. కానియిప్పుడు ఒకగొప్పవైద్యుని అనేక సంవత్సరముల పరిశోధనాఫలితము ౪ 8 రోజులలోనే అవ్యాధి ఆశ్చర్యకరముగా నయమగుచున్నది. మందుఉపయోగించుట మొదలిడగానే స్రావముతగ్గిపోయి చిరాకు, నిస్పృహ, విచారము ఎదుమనొప్పులుమాయమగును. ఈవ్యాధికి కారణములగు ట్రైకోమోనాఫ్ అను క్రిములు లాకోసెక్రిన్ నందలి నిరపక క్రిమినాశక గుణములు గల్గిన ఓషధులచే నాశనముచేయబడును, అందువల్లనే లాకోసెక్రిన్ ను వైద్యులు గొప్పపరిశోధనగా పరిగణించినారు.

84 మాత్రలుగల సీసా వెల రూ. 2-8-0

స్టాకిష్టులు:-సయ్యద్ అబ్దుర్ రజాక్, లెస్లీగే మొదలగువారు.

# రమణీయమైన ప్రకృతిసంపద-సాధనములు

Godrej Sandal

గొడ్రెజ్ వెజిటబుల్ టాయిలెట్ సబ్బు- తయారుకాబడిన వస్తువు

★ భూమినుండి త్రవ్విన పరిశుద్ధమగు చెట్లమొక్కల తైలములు.

★ శరీర లావణ్యమునకు, వివర్ణనివారణకు అనాదికాలమునుండియు ప్రసిద్ధిచెందిన వనస్పతుల ద్రవ్యములు.

★ దివ్యమైన గంధపు మ్రానులయొక్క చల్లని మనోహరమగు సువాసన.

—సహజ సిద్ధముగా ప్రకృతి దేవత ప్రసాదించిన యీ వస్తు జాలముల పశాస్త్రీయ సమ్మేళనమే గొడ్రెజ్ శాండల్ సోపు అవతారము.

ఎండవేడిమిచే కమలి, అనుతాపమొందిన లేత శరీరములకు యీ సబ్బు వాడినచో దాని చల్లని నురుగు సేదదీర్చి అమోఘమైన పోషణ నొసంగును. దీనిని వాడినవెంటనే శరీరమునకు ఒకవిశేషమైన ఉల్లాసము సంతోషము చల్లదనము చేకూరును.

మీరంతట మీరే వాడి ఆయా భేదములను తెలిసికొనుడు.

యితరరకములు— గొడ్రెజ్ 1-వ నెంబరు, 2-వ నెంబరు, లిండా (వేప, మరియు క్షారము సబ్బు.

Godrej ALL SWADESHI PRODUCT

గొడ్రెజ్ సోప్సు, లిమిటెడ్.

సేల్సు డిపార్టుమెంటు

డిలైల్ రోడ్ : : : బొంబాయి.

# ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ

( లిమిటెడ్ )

హెడ్ ఆఫీసు:-మచిలీపట్నము

అత్యల్పమగు రేట్లతో అత్యధికమయిన హామీనిచ్చునది "ఆంధ్ర" మంచిఆర్థికబలంకలిగి వృథావ్యయంకాకుండ అభివృద్ధిగాంచుచు తగుపాటిదినాదాయం కలవారికికూడా తమజీవితముల భీమాచేయుటకు అందుబాటులోనున్నది ఆంధ్రభీమాసంస్థయే.

మాయభివృద్ధిని గాంచుడు.

| సంవత్సరము. | | క్రొత్తవ్యాపారం. | ప్రీమియంరాబడి. | భీమానిధి. |
|---|---|---|---|---|
| 1927 | ... | రూ. 6,32,500 | రూ. 44,330 | రూ. 29,000 |
| 1930 | ... | ,, 13,73,500 | ,, 1,93,000 | ,, 2,15,000 |
| 1933 | ... | ,, 19,42,000 | ,, 2,98,000 | ,, 7,16,000 |
| 1935 | ... | ,, 27,10,000 | ,, 4,60,900 | ,, 11,57,000 |
| 1939 | .. | ,, 35,29,000 | ,, 8.06,500 | ,, 26,30,000 |

రూ. 14 లక్షలు సర్కారువారియొద్దను, వారంగీకరించిన సెక్యూరిటీలలోను ఉంచబడినవి. అమలులోనున్న వ్యాపారం. రూ.1,60,00,000 మీరుభీమాచేయుటయేగాక, మీబంధుమిత్రాదులచే మావద్దభీమాచేయింపుడు.

పలుకుబడిగల ఏజంట్లు నిజాంరాష్ట్రమునందంతటను కావలెను.

వివరములకు వెంటనే క్రిందివారికి వ్రాయుడు.

గాడేపల్లి జగన్నాథం,

చీఫ్ ఏజంట్

సికింద్రాబాదు.

## బ్రిటిషు సేనాని అమెరికా సేనానులతో మాట్లాడుట

హాంకాంగు, ఏప్రెలు౧౬:

హాంకాంగుకు బ్రిటిషు సేనాని సర్ రాబర్టు బ్రూకుపాపుహాంగారు మనిల్లానుండివచ్చిరి. అచట ఫిలిప్పయినుదీవులలో అమెరికనుసేనాధికారులతో మాట్లాడిరి.

చైనాలోఉండవలసిన బ్రిటిషురాయబారి యగు సర్ఆర్చిబాల్డుక్లార్కు-కెర్ గారుకూడా హాంకాంగువచ్చిరి, వీరుచంకింగునకు పోవుచున్నారు. ప్రాచ్యప్రాంత బ్రిటిషుసేనానియగు రాబర్టుబ్రూకు పాపుహాంగారు తిరిగిమనిల్లాకెళ్లి అక్కడినుండి సింగపూరుకెళ్లెదరు. మనిల్లాకు పోలండువిదేశాంగమంత్రియగు సాగ్ల్లా ఫెన్సుగారు అచటఉన్నారు. అచటనుండివారు డచ్చియీస్టుఇండీసుకువెళ్లుదురు-

### టర్కీ సేనానులతో బ్రిటిష్ సేనానుల సంభాషణ-

తుర్కీ లోని సైనికాధికారులతో బ్రిటిష్సైనికాధికారులగు మార్షలు కారన్వాలుగారును, పైనుమార్షలుఎల్మ్హర్స్టుగారును మాట్లాడిరి. మాట్లాడినపిదప అంకారానుండి ఇస్తాంబుల్కువెళ్లిరి. అచిట థ్రేసువద్దనున్న తుర్కీ-సేనల బందోబస్తులను చూచుటకువెళ్లిరి-

### చీనావారికి అఖండవిజయము

చుంకింగు, ఏప్రిలు౧౫:

కియాంగ్సీయుద్ధములో ౨౦వేలజపానువారు హతమయిరనియు, వీరిలోముగ్గురు జపానీయ సేనాపతు లుండిరనియు చీనాహా రనియుండిరి. ఈయుద్ధమువిషయమై చీనాయుద్ధమంత్రి జనరల్హోయింగుచింగు గారు చెప్పుచు చీనాజపాను యుద్ధము ప్రారంభమైనతరువాత చీనాకింత గొప్పవిజయమెన్నడు కలిగియుండలేదని చెప్పెను- చుంకింగుసేనలనుఅణచి, కియాంగ్సీ వాయవ్య దిక్కున యుద్ధపరిసమాప్తి గావించితిమని చెప్పిన జపానువారు సాంకోకోదూర్చుననున్న కొండలలోకవపేరలను అన్నివైపులనుండియు చుట్టుముట్ట ప్రయత్నించిరనియు, కొందటచీనావారు జపానువారిరెక్క-లను విరుగగొట్టి తరువాతకేబరము మీదికివెళ్లిరనియు ఆయనచెప్పెను-

## అమెరికాలో ఇటాలీయుల అరెస్టులు

### మెక్సికో ప్రభుత్వం విధించినశిక్షలు

మెక్సికోసిటీ, ఏప్రిల్ ౮

అట్లాస్ను ఇటాలీయనునావనుముంచివేసిన ఇటాలీయ నావికుల మెక్సికోప్రభుత్వము వారిచే అరెస్టుచేయబడిరి. బహుశఃవారికి ౮ సం॥లు శిక్షయున్నూ ౫వేల పెసోలు జరిమానయున్నూ విధింపబడవచ్చును. అట్టిశిక్షాప్రమాణంగల శిక్షకొరకు వారిపైనిందారోపణ చేయబడెను.

### పెరూప్రభుత్వం అరెస్టుచేసిన జర్మనీ నావికులు

మ్యూంకెనుఅను జర్మనుస్టీమరున్నూ, హెర్మాంతిన్ అను జర్మనుస్టీమరున్నూ దక్షిణఅమెరికాలోని పెరూరాజ్యంతాలూకుకాలాహారేవునుండి సోమవారంనాడు తప్పించుకొనిపోయెను. అనావలను వారుతగులబెట్టిరి. ఆనావికులు కాస్త్రోచేరిరి, వారువెంటనే పెరూప్రభుత్వము వారిచే అరెస్టుచేయబడిరి.

## ఇటాలీయకాన్సలు అరెస్టు

అమెరికాలోని పెనామాకొల్వ పగడాలోని కొలాపువద్దనుండే ఇటాలీయనుకాన్సలు (ప్రతినిధి) అరెస్టుచేయబడి జేయిలులోఉంచబడెను. సదరుఇటాలియను కాన్సలుకార్యాలయము లోని ముగ్గురుఆఫీసర్లన్ను "కాంటీబియాంకమానో" అనుఇటాలియను స్టీమరులోని ముగ్గురు ఆఫీసరులున్ను కూడాఅరెస్టుచేయబడిరి. అనావికులు నావలనుధ్వంసంచేయవలెనని ప్రయత్నిస్తూ ఉండడంవల్లవారు అరెస్టుచేయబడిరి. ఆనావలోని వారు ౫౦౦మందిఆఫీసర్లున్న నావికులున్నుఒక సైనికనావమీద ఎక్కించబడి పెనమాకాల్వపరగణానుండి అమెరికా సం॥రా॥లకు పంపబడిరి, అచటవారు నిర్బంధప్రవాసంలో ఉంచబడుదురు

## అమెరికాలో ౨౧౨ వర్తక నావలనిర్మాణము

వాషింగుటను, ఏప్రిల్ ౮

అరువు, కవులు చట్టముప్రకారంగా ఇంగ్లండుకు సహాయముచేయు నిమిత్త మైఅమెరికా ప్రభుత్వము ౭౦౦౦కోట్ల డాలర్లుప్రత్యేకించినది. ఆమొత్తములోనుండి ౫౦ కోట్లడాలర్లుతిరిగిప్రత్యేకించి౨౧౨వర్తక నావలను నిర్మించుటకు వినియోగించెదరు. ౫౦లేదా౬౦ నౌకానిర్మాణశాలలందు యీపైజెప్పిన ౨౧౨వర్తక నావలు నిర్మింపబడును

ఎర్రసముద్రం యుద్ధప్రాంతం గా అమెరికా ప్రభుత్వముచే పరిగణింపబడదనియు త్వరలోనే ఎర్రసముద్రంలోనికి అమెరికా నావలువెళ్లిచాలా సామగ్రులను దిగుమతిచేయగలవనియుతెలియుచున్నది. ఈజిప్టుకు సుమారు ౧౦౦ అమెరికను నావలు సరకులును చేర్చగలవు,

### అమెరికాతయారుచేసెడి విమానాలు, నావలు

అరువు కవులుచట్టంక్రింద అమెరికాప్రభుత్వం ౧౫,౦౦౦ విమానాలను, ౫వేలటాంకులను 33౦ వర్తక నావలను నిర్మింపదలచియున్నది. అవిమానాలలో అనేమపత్తు ౧3 శాతమైనను బ్రిటిషువారికి సప్లయిచేయబడెను. మిగిలినవియుద్ధ నావలకు వెంట ఉండేవిమానాలుగా సప్లయిచేయబడెను

## సయాం ప్రధానిని జపానుకురమ్మని సందేశం

థాయిలాండు (సయాం) ప్రధానియగు లవంగవిపులసంగ్రాము గారు జపాను ముఖ్యనగరమగు టోకియోకువిచ్చేసి జపానువిదేశాంగమంత్రియగు మట్సువోకా గారితో మాట్లాడిపోవలెనని జపాను ప్రభుత్వమువారొకసందేశమును అందజేసిరని వార్త ఇచ్చుటసయాంలో ప్రబలంగా వ్యాపించియున్నది, ఈవార్త అసత్యమని సయాంప్రభుత్వం ఖండించుటలేదు. ఒకవేళ అట్టిఆహ్వానమువచ్చిన మొదల సయాంప్రధాని నిరాకరింపజాలడని సయాంలోని రాయబారులుచెప్పిరి. బహుశః జపానువిదేశాంగ మంత్రియగు మట్సువోకా గారు జర్మనీనుండి జపానుకుతిరిగివచ్చినపిమ్మట యీసమావేశం జరుగవచ్చును,

## అమెరికాలోని జర్మనీ ఇటలీల నావలు

### యురుగ్వేవారు సంయుక్త రాజ్యమార్గమనుసరించుట

లండను, ఏప్రిలు౧౫:

ఇటలీనావలపై చర్యగైకొనుటలో యురుగ్వే యితరలాటిన్ అమెరికాదేశముల మార్గమవలంభించినది. కొన్నాళ్లక్రిందట యురుగ్వేలో తలదాచుకొన్న రెండుఇటలీనావలను రెండుడచ్చినావలను యురుగ్వేవారు వశపరచుకొనిరి,

మెక్సికనుసైనికులు ఒకజర్మనునావను ఆక్రమించుకొని, ఆనావలోనివారిని బంధించినందులకు జర్మనీమెక్సికోకు అసమ్మతితెలిపెను. పట్టుకొనిన ఓడలను, నావికులను విడుదలచేయుటకు మెక్సికో ప్రభుత్వమునిరాకరించెను.

